# అభినవసరస్వతి

| సంపుటము ౨౮ | ధాతృనామ సంవత్సరము భాద్రపద మాసము | సంచిక ౬ |
| --- | --- | --- |

## —* విజయనగరవినాశనము *—

విద్యా(విజయ)నగరము విద్యారణ్యులవారి ప్రోత్సాహసాహాయ్యములతో నప్పటి కానెగొంది రాజధానిగాఁ బరిపాలించుచున్న హరిహరునిచేఁ గ్రీ. శ. 1336 లోఁ గట్టింపఁబడి యదిమొదలుకొని 1565 సం॥ వఱకుఁ బదునేడురు ప్రభువులచేఁ బాలింపఁబడి 229 సం॥లు మహావైభవమనుభవించి తుదకుఁ దురకలచే ధ్వంసముకావింపఁబడియెను. ఉత్తరహిందూదేశమునుండి మహాప్రవాహముతో వెడలి దక్షిణహిందూదేశమందలి హిందూమతమును హిందూరాజ్యములను రూపుమాపుటకు సిద్ధముగానున్న మహమ్మదీయమహానది నిన్ని సం॥ అడ్డగించి రక్షించిన యీవిజయనగరసామ్రాజ్యమును వేయినోళ్ళఁ గొనియాడినను దనివితీరదు. దక్షిణహిందూదేశమున కిట్టివిపత్తు ప్రాప్తించినపు డుద్ధరించుట కవతరించిన రాజ్యమే విజయనగరసామ్రాజ్యము. ఈ రాజ్యమే యేర్పడకున్న నిప్పటికి 500 సం॥ల నాఁడే మనదేశమంతయుఁ బూర్తిగాఁ దురుష్కులపాలై క్రమముగా నందఱము యవనుల మైపోయెడివారలము. విజయనగరనిర్మాతయగు హరిహరుఁడును బుక్కుఁడును సంగమరాజసంభవులు. సహోదరులు హరిహరరాయలు మొదట ఢిల్లీశ్వరునకు సామంతుఁడుగానున్నను ద్వరలోనే స్వతంత్రుఁ డయ్యెను. ఓరుగల్లు మహిశూరు మొదలైనప్రదేశములను జయించి రాజ్య మభివృద్ధిచేసెను. ఢిల్లీసుల్తానును బరాభవించి యద్వితీయపరాక్రమశాలి యయ్యెను. హరిహరరాయలకు నలుగురుతమ్ములు. శూరాగ్రేసరులగు తమ్ములు రాజ్యవిస్తారముచేయుటలో హరిహరరాజునకు నెంతయో సాహాయ్యము చేసిరనుటకు సందేహములేదు. వీరందఱికంటెను నెక్కుడుసాయము చేసిన మహానుభావుఁడు విద్యారణ్యులు. సన్న్యాసమునకుఁ బూర్వ మీసత్పురుషునకు మాధవాచార్యులని పేరు. వారు ప్రథమహరిహరబుక్కరాయ ద్వితీయహరిహరరాజుల కాలములో మంత్రిగానుండిరి. విజయనగరసామ్రాజ్యము నూతనముగా నిర్మించిన శ్రేయస్సంతయు మాధవాచార్యులదే. హరిహరబుక్కరాయలు పేరునకుమాత్రము రాజులుగా నుండిరనియు రాజ్యభారమంతయు నాశ్రమస్వీకారమునకుఁ బూర్వమును దరువాతను విద్యారణ్యులే వహించిరనియు నైతిహ్యము. శ్రౌతస్మార్తకర్మములన్నియు నశించుటఁ జూచి యుద్ధరించుటకై సామ్రాజ్యము నిర్మించుటచూడ నితఁడద్వితీయమహాపురుషుఁడని చెప్పవలసియున్నది. శ్రౌతము, స్మార్తము, వేదాంతము, ధర్మశాస్త్రము, మీమాంస, జ్యోతిశ్శాస్త్రము, వైద్యము, వ్యాకరణము, చరిత్ర

మొదలయిన యన్నివిషయములమీఁద వీ రుద్గ్రంథములు వ్రాసిరి. అందు వేదభాష్యము ముఖ్యమైనది. పరాశరమాధవీయము ప్రఖ్యాతిని జెందియున్నది. పంచదశి శంకరవిజయము జైమినీయన్యాయమాల సర్వదర్శనసంగ్రహము విద్వన్మాన్యములు. వైదికమతము నుద్ధరించుటకు వేదభాష్యాదులను మతస్వాతంత్ర్యము రక్షించుటకు విజయనగరసామ్రాజ్యమును నిర్మించి శృంగేరిలోని జగద్గురుపీఠము నలంకరించి యీ యతిశ్రేష్ఠుఁడు నూటేండ్లకంటె నెక్కుడుకాలము జీవించి 1386 సం॥లో సమాధిస్థుఁడయ్యెను. విద్యారణ్యులచే నిర్మింపఁబడిన యీపట్టణము సకలవిద్యాసంపత్తులచే శోభితం బగుటచే విద్యానగరమనియు శూరాగ్రేసరులకుఁ బుట్టినిల్లైనందున విజయనగరమనియు విఖ్యాతి వహించి యొప్పుచుండెను. హరిహరరాయఁడు 1336 మొదలు 1350 వఱకు రాజ్యము చేసి కీర్తిశేషుఁడయ్యెను. సంతానము లేనందున నతని మరణానంతరము తమ్ముఁడగు బుక్కరాయఁడు రాజ్యారూఢుఁడయ్యెను. బుక్కరాయలు శూరాగ్రేసరుఁడు. విద్వత్ప్రియుఁడు. విద్వాంసుల పొగడ్తగన్న సాయణభాష్యమీమహారాజు పేరుతో నంకితమైయున్నది. ఈరాజు విజయనగరము నభివృద్ధి చేసి చక్కఁగాఁ గట్టించెను. ఆపట్టణము వీరులకును విద్వాంసులకును దమతమసామర్థ్యముఁజూపి బహుమతులు వడయుటకు వీలైనదై విజయనగర విద్యానగరనామములను సార్థకపఱుపఁజొచ్చెను. బుక్కరాయలు చెఱువులను బావులను గాల్వలను ద్రవ్వించి ప్రజలకు సౌఖ్యము కలుగఁజేసెను. బుక్కరాజుతరువాత నాతనికి గౌరాంబికవలనఁగలిగిన హరిహరరాయలు రాజయ్యెను. ఇతఁడు మిక్కిలి యదృష్టశాలి. 27 సం॥ల వఱకు మహావైభవముతోడను శాంతతతోడను రాజ్యము చేసెను. రాజాధిరాజ రాజపరమేశ్వరాది బిరుదములు ధరించినందున నీతనికిఁ జక్రవర్తిత్వము వచ్చినట్లును విజయనగరమునకు సామ్రాజ్యవైభవము కలిగినట్లును దెలిసికొనవచ్చును. ఇతనికి రెండవబుక్కరాయలు. అతనికే దేవరాయలని మాఱుపేరుండెనని కొనవచ్చుచున్నది. ఇతఁడు పట్టణములో ననేకప్రాకారములను బురుజులను గట్టించెను. అన్నిటికంటె నితఁడుచేసిన మహాకార్యము పట్టణములోనికిఁ దుంగభద్రానదీతీర్థమును దెచ్చుట. అంతకుఁ బూర్వమునం దాపట్టణములో మంచిజలము లేనందున జనులకు మిక్కిలి యిబ్బందిగానుండెను. ఉన్నజలము పరిశుద్ధమైనదికానందునఁ దోఁటలు మొదలైనవి చక్కఁగాఁ బెరుఁగక పోయెను. అందుచే విజయనగరపట్టణమునకు 12 మైళ్ళమీఁదఁ దుంగభద్ర కొనకట్ట గట్టి యొకకాలువను దీసికొనివచ్చెను. పట్టణమందు జలసమృద్ధియైనందున నెచ్చటఁజూచినను లతాకుంజములును బుష్పోద్యానములును ద్రాక్షాతాంబూలాదుల తోఁటలును సమృద్ధిగాఁ బెరిఁగి నగరశోభ హెచ్చి రాజునకు 12 లక్షలయాదాయము నూతనముగాఁ గలిగెను. ఈకాలువ యిప్పటికిని గానవచ్చుచున్నది. దానినిర్మాణచాతుర్యముఁ జూచి యిప్పటి యింజినీర్లు నాశ్చర్యమగ్నమానసు లగుచున్నారు. దేవరాయమహారాజు 1422 లోనో 1423 సం॥ ప్రారంభమందో కాలధర్మమునొందెను. అతనికి హరిహరుఁడు, విజయుఁడు, మల్లన్న యని ముగ్గురుపుత్రులుండిరి. అందు విజయుఁడు తండ్రిజీవితకాలమందే యువరాజుగా

నుండి తరువాత రాజై యొకసంవత్సరము మాత్రము రాజ్యముచేసి కాలధర్మము నొందినట్లు కానవచ్చుచున్నది. ఇతనికి రెండవదేవరాయఁడు. అతఁడు 225 కోట్ల రూపాయలు సంగ్రహింపఁగలిగెను.

ఇదిగాక రత్నాదులు విశేషముగానుండెను. సిలోను మొదలైన యనేకదేశముల రాజు లాతనికి సామంతులై కప్పముగట్టుచుండిరి. విదేశీయుఁడైన పోర్చుగీజు వానిచేవ్రాయఁబడినందున నారాజునకు దూరదూరదేశపుసామంతులుండిరనియు నింత ధనమేచక్రవర్తియొద్దను నిల్వలేదనియుఁ గనుక విజయనగరరాజ్యము విస్తారముగానుండెననియు నిశ్చయింపవచ్చును. దేవరాయలకు మల్లికార్జునుఁడు. ఇతఁడు యుద్ధము లేమియులేకుండ 20 సంవత్సరములవఱకు రాజ్యము చేసెను. మల్లికార్జునరాయల తరువాతఁ దమ్ముఁడగు విరూపాక్షుఁడు రాజయ్యెను. ఇతఁడు స్త్రీలంపటుఁడు. సురాపానమత్తుఁడు. ఎప్పుడును విషయాసక్తుఁడై యంతఃపురములోనే యుండి ప్రజల కెన్నఁడును గనఁబడువాఁడు కాఁడు. విషయాసక్తుఁడగునీ విరూపాక్షరాయని పెద్ద కుమారుఁడగు రాజశేఖరరాయలు చంపించెను. ఇతని నీతని తమ్ముఁడగు రెండవ విరూపాక్షరాయలు చంపించెను. ఈ భ్రాతృహంతకుని పరిపాలన ప్రజల కిష్టమైనదికాదు. అతని దండనాయకుఁడగు సాళువ నరసింహరాజు సర్వజనులుఁ దనకనుకూలురుకాఁగా రాజును వెడలఁగొట్టి రాజ్యమునాక్రమించుకొనెను. అంతటితో నీప్రథమవంశ మంతరించెను. సాళ్వవంశమువారు బుక్కరాయవంశములకు బంధువులు. సాళువనరసింహరాజు విరూపాక్షరాయలకాలములోఁ బ్రబలెను. విజయనగరసామ్రాజ్యమునకుఁ బ్రభువయ్యెను. ఈరాజు 1490 సం|| లోనో యాప్రాంతముననో మరణము సమీపించినదని తెలిసికొని తుళువ నరసరాయలను బిలిపించెను. ఈనరసరాజు సాళువ నరసింహరాజున కన్నమనుమఁడు. అతనిని బిలిపించి యాసాళువ నరసింహరాజు తనయిద్దఱు కుమారుల నప్పగించి పెద్దవాండ్రగువఱకుఁ దాను రాజ్యమేలి యిరువురిలో నెవఁడు రాజ్యమున కర్హుఁడో వాని కీయవలయునని చెప్పెను. మృతినొందినతరువాతఁ బెద్దకుమారుఁడగు నరసరాజును రాజ్యారూఢుని జేసి వాఁడు చిన్నవాఁడగుటచేఁ దుళువ నరసరాజు రాజ్యము చేయఁదొడఁగెను. ఈబాలరాజు నెవఁడో చంపెను. అంత నతని తమ్ముఁడు రాజయ్యెను. ఆబాలరాజును జంపించి నరసరాజు సింహాసనారూఢుఁడై విజయనగర రాజ్యమును మహోన్నతదశకుఁ దెచ్చిన, తృతీయరాజవంశమునకు మూలపురుషుఁడయ్యెను. నరసరాజునకు ముగ్గురు భార్యలు. తిప్పాజీ, నాగలాంబిక, ఓబాంబిక. తిప్పాజీవలన వీరనృసింహరాయఁడు, నాగలాంబికవలనఁ గృష్ణరాయఁడు, ఓబాంబికవలన నచ్యుతరాయఁడుఁ బుట్టిరి. నరసరాజు పోయినతరువాత నాతని పెద్దకుమారుఁడగు వీరనరసింహరాయలు రాజ్యమునకు వచ్చి కొలఁదికాలములోనే మరణ మొందెను. అతని తమ్ముఁడగు కృష్ణరాయలు రాజయ్యెను.

ఇతఁడు విజయనగరరాజులలో సర్వశ్రేష్ఠుఁడని చెప్పుట యొక వింతగాదు. దక్షిణహిందూదేశములో నింతటి వైభవపరాక్రమశాలియగుచక్రవర్తి మఱియొక్కఁడు

పుట్టలేదనుటకు సందేహము లేదు. విజయనగరసైన్య మీతని ప్రభుత్వకాలమం దపజయమన్నమాట యెఱుఁగక మహాబలాఢ్యులగు యవనాదివీరుల నెల్లఁ జెండాడి విజయలక్ష్మిచే వరింపఁబడుచుండెను. ఈతనికాలములో విజయనగరవిభవమార్తాండుఁ డాకాశమధ్యంబున నుండి ప్రచండంబుగా వెలుఁగుచుండెను. ఇతనితల్లి నాగాంబిక నరసరాజునకు భార్యగాదనియు భోగకాంతయనియు నొకవాదుక కలదు. అచ్యుతరాయాభ్యుదయమను సంస్కృతకావ్యమునందుఁ గృష్ణదేవరాయలకు సవతితల్లికొడుకును నతనితరువాత విజయనగరరాజును నైన యచ్యుతరాయల శౌర్యాదికములు వర్ణింపఁబడినవి. ఈకావ్యము రాయలకు సమకాలీనుఁడగు రాజనాథమహాకవిచే రచింపఁబడినది. కావున నమ్మఁదగిన చరిత్రాత్మకగ్రంథమైయున్నది. ఇందు నరసరాజు భార్యలలో ముగ్గురు పట్టమహిషులుండిరనియు వీరందఱును రాచబిడ్డలనియు వీరిలోఁ దిప్పాంబకు వీరనృసింహరాయఁడును నాగాంబకుఁ గృష్ణరాయఁడును నోబాంబ కచ్యుతరాయఁడును బుట్టిరనియు స్పష్టముగా వ్రాయఁబడియున్నది.

శ్లో॥ ఆద్యైరపి క్షోణిపతిప్రకాండై రాకాంక్షణీయ స్వయశోవతారః
వసన్ స తస్యాం వసుధాపతీనాం కన్యామణీః కాశ్చన పర్యణైషీత్
తిస్రో నృపస్యాత్య భవన్నభీష్టా స్తిప్పాంబికా తాసుచ నాగమాంబా
పట్టాభిషిక్తాః పతిదేవతానా ముత్తంసభూషామణి రోబమాంబా.

కృష్ణరాయలుమంత్రి తిమ్మరుసు. ఈతని బుద్ధిబలముచేతను మంత్రశక్తిచేతను గృష్ణరాయని కసంఖ్యవిజయములును నధికవిఖ్యాతియుఁ గలిగెననుటకు సందేహము లేదు. కనుకనే కృష్ణరాయ లీతని నప్పాజీ (నాయనగారు) అని పిలుచుచుండెను. ఈకృష్ణదేవరాయలు సంస్కృతాంధ్రములయం దసామాన్యపాండిత్యముగలవాఁడు. విష్ణుచిత్తీయమను నామాంతరముగల యాముక్తమాల్యదయను నాంధ్రకావ్యమొకటి యీతఁడు రచించెను. ఈకావ్యము శైలి కష్టతరమైనను నూతనవర్ణనాంశములచే శోభిల్లుచు సుద్గ్రంథమని పేరువడసినది. ఈకావ్యమువలన నీతని కాంధ్రగీర్వాణములలోఁగల ప్రజ్ఞ వెల్లడియగుచున్నది. కవియుఁ బండితుండు నగుటయే కాక యీనృపపుంగవుఁడు సంస్కృతాంధ్రకర్ణాటకవుల నాదరించి దిగంతవిశ్రాంతయశుఁ డయ్యెను.

ముఖ్యముగా నీరాజపుంగవుని కారుణ్యవశంబునఁ దెనుఁగుబాస మహోన్నతపదవిని జెందినది. ఈతనియాస్థానమం దష్టదిగ్గజములను పేరిట నెనమండ్రు తెలుఁగు కవు లుండిరనినమాట పరంపరగా వచ్చుచున్నది. అల్లసాని పెద్దన్న, నంది తిమ్మన్న, యయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి మాదయగారి మల్లన్న, పింగళి సూరన్న, రామరాజభూషణుఁడు, తెనాలి రామకృష్ణుఁడు ననెడి యెనమండ్రును నష్టదిగ్గజము లని వాడుక. రాయలయాస్థానములోని కవులలో నగ్రగణ్యుఁ డల్లసాని పెద్దన. ఇతఁడు మనుచరిత్ర మను కావ్యమును రచించి కృష్ణరాయల కంకితముచేసెను. రామరాజభూషణుఁడు వసుచరిత్రమహాకావ్యకర్త. భట్టుమూర్తి యనునది యితనికిఁ

పేరనియు రామరాజభూషణుఁడన్నది రామరాజుసభలో నున్నందున వచ్చినబిరుదమనియుఁ జెప్పెదరు. ఇతఁడు రాయల యల్లుఁడగు రామరాజుకాలములో నింకను బ్రతికినను కృష్ణరాయల కాలములోను నుండవచ్చును. వసుచరిత్ర కృష్ణరాయల పెంపకయల్లుఁడగు తిరుమలరాయని కంకిత మీయఁబడినది. కృష్ణానదికి దక్షిణమున నున్న దేశమంతయుఁ గృష్ణదేవరాయ లేకచ్ఛత్రాధిపత్యముతో నేలఁగలిగెను. ఇదిగాక తూర్పునఁ గటకమువఱకును బశ్చిమోత్తరముల విజాపురాదిపట్టణములవఱకును జాడివెడలి ప్రబలశత్రువుల నందఱను జయించెను. ఇతఁ డపజయమన్న మాట యెఱుఁగఁడు. ఈయనకు స్త్రీసంతానమే నిలిచియున్నది. అందుఁ దిరుమలాంబికను నరపతివంశజుఁడగు రామరాజును వెంగళాంబ నతని తమ్ముఁడును వసుచరిత్ర కృతిభర్తయునైన తిరుమలరాజును వివాహమాడిరి. ఈ కృష్ణదేవరాయలు 1530 లోఁ గీర్తిశేషుఁడయ్యెను. ఈతని తమ్ముఁడగు నచ్యుతదేవరాయలు విజయనగరసింహాసనమున కధిపుఁడయ్యెను. మహారాజ్యవైభవము ననుభవించెను. ఈతని యంతఃపురములో వాడఁబడు పాత్ర లన్నియు బంగారముతోను బరుపులు పట్టుతోను దోమతెరలు వెండితీఁగెతోను జేయఁబడినవి. అంతఃపురసంబంధి సేవకు లేఁబదివేలవఱకు నుండిరి. ఈయచ్యుతరాయలు 1542 లో మరణము నొందెను. అతని కుమారుఁడు వెంకటరాయలను వాఁడు రాజయ్యెను. ఇతఁడు బాలుఁడు. మంత్రులలో 2 కక్షలు పుట్టెను. ముఖ్యమంత్రియైన సలకము తిమ్మయది యొకకక్ష. కృష్ణరాయల యల్లుఁడు రామరాజుది యొకకక్ష. సకలమంత్రులును సలకముతిమ్మయ కనుకూలురైనందున రామరాజు చేయునది లేక విజయనగరము విడిచి స్వకీయమైన జాగీరునకుఁ జనియెను. తిమ్మయ బాలరాజును జంపి తానే రాజయ్యెను. తక్కినసరదారు లాతనిపైఁ దిరుగఁబడి రామరాజును రప్పించిరి. తిమ్మయ భయపడి యాదిల్‌షాహ కంకితుఁడ నయ్యెదనని తెలిపి రప్పించి సింహాసనముమీఁదఁ గూర్చుండఁబెట్టెను.

రామరాజాదులు తిమ్మయయొద్దకుఁ బోయి నవాబును బంపివేసినయెడల మేమందఱము నీకు లోఁబడియుండెదమని బాసలుచేసిరి. నమ్మి తిమ్మయ నవాబునకుఁ గొంత ధనమిచ్చి బ్రతిమాలుకొని పంపివేసెను. అతఁడరిగినతోడనే రామరాజును దక్కినసరదారులును దిరుగఁబడిరి. ఇఁకఁ దాను బ్రదుకుట దుర్లభమని సలకము తిమ్మయ పొడుచుకొని చచ్చెను. అంతఁ గృష్ణరాయల మఱొకతమ్ముఁడగు సదాశివరాయల సింహాసనముమీఁదఁ గూర్చుండఁబెట్టి రామరాజాతనికై రాజ్యము చేయఁ జొచ్చెను. ఈసదాశివరాయలును నచ్యుతరాయలును నరసరాజున కోబాంబికవలనఁ గలిగిన పుత్రులు. సదాశివరాయల కాలములో నిజముగా రాజ్యము చేసినవాఁడు రామరాజు. చాళుక్యవంశజుఁడును గళ్యాణపురాధీశుఁడును నగు బిజ్జలుఁడు వీరికిఁ బూర్వపురుషుఁడు. శూరాగ్రేసరుఁడు. ఈరాజున కిద్దఱుభార్యలు. బళ్ళాదేవి, యబ్బళదేవి. బళ్ళాదేవికి సింగరాజు మొదలైనవారును, నబ్బళదేవికి రామరాజును బుట్టిరి. ఈరామరాజుభార్య లక్కమాంబ. ఈదంపతులకుఁ దిమ్మరాజుఁ గొండరాజు. శ్రీరంగరాజు నని ముగ్గురుపుత్రులు. ప్రస్తుతపు రామరాజు శ్రీరంగరాజు

మూఁడవకుమారుఁడు. ఈయన నవాబులను దిద్దిమ్మని జంత్రపుబొమ్మలవలె నాడించిన మహానుభావుఁడు. అతనివలన విజయనగరవిభవము మహోన్నతమై యతనితోనే నశించెను. ఇతఁడు 1565 లో 96 ఏండ్లవాఁడని 'కీటో' యను చరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. 1469 లో జన్మించియుండును. ఈరామరాజు కృష్ణదేవరాయల కూఁతురగు తిరుమలాంబవలనఁ గృష్ణుని పెదతిమ్మరాజును గొండరాజును జినతిమ్మరాజును, శ్రీరంగరాజును బడసెను. వీరందఱును దండ్రివలెనే రణశూరులై తండ్రికి యుద్ధములలోఁ దోడ్పడుచుండిరి. విజయనగరరాజ్యమున కుత్తరమున 4 తురకరాజ్యములుండెను. మొదటిది విజాపురరాజ్యము. దీనికి బ్రాహిమాదిల్‌శాహా యనువాఁడు సుల్తానుగానుండెను. రెండవది యహమ్మదనగరరాజ్యము. ఈరాజ్యమునకు బుర్హాన్ నిజాంశాహా యధిపతి. మూఁడవది గోలకొండరాజ్యము. జమ్షీదుకుతుబ్‌శాహా దీని కధిపుఁడు. నాల్గవది బేదర్‌రాజ్యము. దీని నలీబెరీదు పాలించుచుండెను. రామరాయల కుమారుఁ డొకఁడు మరణము నొందఁగా నాదిల్‌శాహా విజయనగరమునకుఁ బోయి దుఃఖోపశమనవాక్యములు పలికి మీపుత్రునిఁగా నన్నుఁజూచుకొమ్మనియెను. రామరాజు భార్య యాదిల్‌శాహాను బుత్రభావమునఁ బెంచుకొనెను.

అప్పటినుండియు రామరాజును నాదిల్‌శాహాయును బితృపుత్రుల వరుసతో నొకరినొకరు పిలుచుకొనుచుండిరి. ఆవిజాపురపు నవాబు కళ్యాణి షోలాపురముఁ దనకిచ్చివేయవలసిదని నిజామ్‌శాహాకు వర్తమాన మంపెను. ఆవర్తమానము తీసికొని పోయిన దూతను నిజామ్‌శాహా యగౌరవించి యంపెను. రామరాజును విజాపురినవాబును నహమ్మదునగరముమీఁదికి దండెత్తి ధ్వంసముచేసిరి. హిందువులు ముసల్మానులయెడఁగల కోపమంతయుఁ దీర్చుకొనిరి. స్త్రీల నగౌరవపఱచిరి. మసీదులు పడఁగొట్టిరి. ఖురాను జించివైచిరి. ఇట్టివర్తనమే హిందువులకుఁ దరువాతఁ గలిగిన పరాభవమునకు బీజారోపణము. ఇట్లు రామరాజును నాదిల్‌శాహాయుఁ దనరాజ్యమును గాల్చివేయుటయు నిజాము సంధి వేడెను. కల్యాణిదుర్గమును బెంపుడుకొడుకైన యాదిల్‌శాహాకొఱకు సాధించి రామరాజు విజయనగరమునకు వెడలెను. నిజాము కల్యాణిదుర్గము వదలలేక యిబ్రహింకుతుబ్‌శాహాతోఁ గలసి మరల దురమునకు బయలుదేఱెను. రామరాజును నాదిల్‌శాహాయు సైన్యములతో నెదిరించిరి. భయపడి యిభరాంకుతుబ్‌శాహా నిజామును విడిచి రామరాజుతోఁ జేరెను. ముగ్గురును దఱుముటయుఁ బాఱి నిజాము తనరాజధానిఁ జేరెను. ఆనగరమునకు ముట్టడి వేసిరి. ఈతడవయు రామరాజు సైనికులు మసీదులు పడఁగొట్టి దేవాలయములు చేసిరి అందువలన శత్రువైన నిజాముకేకాక మిత్రులైన విజాపురాదిప్రభువులకును హిందువులయెడ ద్వేషము కలిగెను. తనకు విజయములే కలుగుచున్నందున రామరాజు నవాబుల లెక్కసేయక యుండఁజొచ్చెను. వారియొద్దనుండి వచ్చెడిరాయబారుల గౌరవించుట మాని తనయెదుట వారు నిల్వఁబడియే యుండవలసినట్లును దనతోఁ బ్రయాణము చేయునపుడు తనయాజ్ఞలేక గుఱ్ఱముల నెక్కఁగూడదనట్లును నాజ్ఞాపించెను. తమరాయబారుల నగౌరవించుటయుఁ దమరాజ్యమాక్రమించుటయుఁ జూచి

నవాబు లీహిందూరాజ్యమను శల్యమును బెఱికివేయ నిశ్చయించిరి. సైన్యసమేతులై తాళికోటదుర్గమును సమీపించిరి. రామరాజును సైన్యముతో యుద్ధభూమికి వెడలెను. 1565 సం॥ జనేవరి 23వ తేది యుభయసైన్యములకును యుద్ధము జరిగెను. విలుకాండ్రు యుద్ధము ప్రారంభించిరి. హిందూసైన్య మధ్యభాగమున శరవృష్టి కురిసిరి. హిందువులు తమతోఁ బోరుచు సమీపింపఁగా నవలకుఁ దొలఁగిరి.

శతఘ్నులు హిందువులపై నగ్నివర్షము గురియసాఁగెను. వార లాఁగలేక యొక్కువజనమును గోలుపోయి వెనుకకు మరలిరి. కుడియెడమవైపులనున్న సైనికులు పరాక్రమముచూపి ముసల్మానుల వెనుకకు ద్రొబ్బిరి ఇట్లుభయపార్శ్వములను దమకే జయముకలిగినందున మధ్యభాగమునను గొంచెము శ్రమపడి నిలువఁగలిగిన జయలక్ష్మి మనదేయని యెంచి హిందువు లవార్యశౌర్యముతోఁ బోరసాగిరి. తన సైనికుల కుత్సాహముకలుగుటకై రామరాజు మేనానుండి దిగి బంగారపుజరీతోను ముత్యపుజాలరులతోను నలంకృతమై కెంపువన్నె మకమాలుబట్టతోఁ జేయఁబడిన ఛత్రముగల రత్నమయమైన యెత్తుగద్దియపైఁ గూర్చుండి రత్నములు వజ్రములు ముత్యములు వరహాలు రూపాయలు మొదలైన ధనమెంతయో తెప్పించి తనచుట్టును బళ్ళెరములలోఁ బెట్టుకొని యుద్ధములోఁ బౌరుషముకనఁబఱచిన శూరులకు బహుమతు లొసంగెను. హిందువులు తురుష్కులమధ్యభాగములోని ఫిరంగీలమీఁదికిఁ బోయిరి. వారు సమీపింపఁగనే ఫిరంగులలో రాగిడబ్బులు వేసి తురుష్కులు కొట్టిరి. 5 వేల హిందువులు మరణమొందిరి. మిగిలినవారు చిందరవందరైరి. నిజాముసైన్యములో నుండి 5 వేల గుఱ్ఱపురౌతులు హిందూసైన్యములోనికిఁ జొరఁబడిరి. రామరాజు మేనాయెక్కి బయలుదేరెను. ఒకయేనుఁగు బెదరివచ్చి మేనామీఁదఁ బడెను. బోయీలు మేనాను విడిచివేసిరి. క్రిందఁబడి లేచి రామరాజు గుఱ్ఱ మెక్కఁబోవుటయు నిజాముశాహ సైనికులు వచ్చి పట్టుకొని కట్టి నిజాముశాహయొద్దకుఁ గొంపోయిరి. అతఁడు వెంటనే రామరాజు మస్తకము తునిమి బల్లెమునకుఁ దగిలించి యెత్తి హిందూసైన్యమునకుఁ జూపెను. హిందువుల వైభవ మేటఁగలిసెను. కొందఱు విజయనగరమునకుఁ బోయి కుటుంబమును ధనధాన్యములను వీలయినంతవఱకుఁ దీసికొని పాఱిపోయిరి. రామరాజు తమ్ములలో వెంకటాద్రి యుద్ధమునందుఁ బడెను. తిరుమలరాజు రాజధానికి వచ్చి పేరునకు రాజుగానున్న సదాశివరాయలను దీసికొని పెనుగొండకుఁ బాఱిపోయెను. రాజును సైనికులును లేని యాపట్టణము నిరాధారమై యుండెను. భయమన్నమాట యెఱుఁగని జనులు దిక్కుమాలినవారైరి. బలాఢ్యులకు సాధ్యముగాని పట్టణశ్రేష్ఠము దొంగలపాలయ్యెను. చుట్టుపట్లనున్న క్షుద్రజాతులు చూఱగొనియెను. తోడ్తోడఁ దురుష్కసైన్యము వచ్చిపడియెను. ఆఱునెలలవఱకు నీసైన్యము లాపట్టణమందుఁ జేసిన ఘోరకృత్యము లింతింతయని వర్ణించుటకు వీలు కాదు.

అనపరాధులగు నసంఖ్యాకజనుల హతముఁజేసిరి. దివ్యభవనములను దేవాలయములను గాల్చి కూల్చి సమస్తపట్టణము శ్మశానముగా మార్చిరి. దేవతావిగ్రహములఁ

బాగులఁగొట్టిరి. అగ్నిజ్వాలలు పర్వియవనుల నవలకుఁ దఱిమెనో యర్చకు లందున్న యమూల్యాభరణాదుల లంచమిచ్చి కాపాడుకొనిరో యధార్థ మాదేవళ్ళకే తెలియవలెఁ గాని విరూపాక్షాలయముఁ గోదండరామస్వామి కోవెల మాత్రము చెకు-చెదరలేదు. కాని వీనికి వేఱయిన విజయనగరరాజ్యభాస్కరుఁడు వెలిఁగివెలిఁగి వికసించెను.

---

## —* దేవాలయ ప్రవేశము *—

(గోవిందరాజు హరిశ్చంద్రరావుగారు)

రఘునందన భట్టాచార్యుఁడు ప్రతిష్ఠాధికారమును గుఱించి దేవప్రతిష్ఠాతత్త్వము 505 వ పుటలో "ప్రతిష్ఠా బ్రాహ్మణద్వారైవ కర్తవ్యా".

శ్లో. నమేద్య శ్శూద్రసంస్పృష్టం లింగంవా హరిమేవవా
స సర్వయాతనాభోగీ యావదాభూతసంప్లవమ్
(బృహన్నారదీయము)

ఆభూతసంప్లవం ప్రళయపర్యంతం. తథా

శ్లో. స్త్రీణా మనుపనీతానాం శూద్రాణాంచ జనేశ్వర
స్పర్శనే నాధికారోస్తి విష్ణౌవా శంకరస్యవా. (బృ॥నా)

అని వ్రాసెను. ఉపనయనాధికారములేని స్త్రీలు మున్నగువారు ప్రతిష్ఠ...స్వయముగాఁ జేయఁగూడదనియు బ్రాహ్మణద్వారమున నది గావింపవలెననియు నీతని యభిప్రాయము...వారు పూజచేయవచ్చునుగాని బింబమును స్పృశింపక దూరముగానుండి యట్లు సలుపవలయునని యాశయము. గ్రంథకర్త వంగదేశమున సుప్రసిద్ధభక్తుఁడగు చైతన్యమహాప్రభువునకు సోదరుఁడు. ఆదేశమునందు బహుప్రామాణికుఁడుగా నెన్నఁబడుచున్నాఁడు. నిషిద్ధస్పర్శదూషిత నిషిద్ధజలస్పృష్ట విప్రక్షతజదూషిత పతితాద్యర్చిత శ్లేష్మవిణ్మూత్రాదిదూషితానాం స్వస్థానస్థితానామేవ పునస్సంస్కారో నోద్ధరణం నాపి ప్రతిపత్తిః, అతిజీర్ణామితి పీఠాచ్చ చాలితమితి త్యజేత్సదోషితం లింగమితి పూర్వోక్తాద్వాక్యనిచయాత్.

(భట్టనీలకంఠప్రణీత ప్రతిష్ఠామయూఖము 36 వ పుట)

(నిషిద్ధస్పర్శదూషితములును నిషిద్ధజలస్పృష్టంబులును విప్రరుధిరదూషితములును పతితాద్యర్చితములును శ్లేష్మవిణ్మూత్రాదిదూషితములునైన మూర్తులను స్వస్థానమున నుంచియే మరల సంస్కారము కర్తవ్యమగుచున్నది. అట్టివాని కుద్ధారము లేదు ప్రతిపత్తియు లేదు. అతిజీర్ణాం పీఠాచ్చాలితం త్యజేత్సదోషితమని పూర్వము నుడివిన వచనముల...వలన నిది తెల్లమగుచున్నది.) సారాంశము "అయమత్ర నిర్గళితోర్థః. [illegible]జ్ఝితస్ఫుటితవిశీర్ణశ్వపచసేవితానాం లింగానాం తాదృశీనాం బాహుపాదరశిః

భగ్ననాసాస్యహీనానాం ప్రతిమానాంచ విధ్యుక్తప్రకారేణ చాలనం జలాదౌ ప్రతిపాదనంచ కృత్వా నూతనప్రకారేణ తస్మిన్నేవ స్థానే పూర్వపశ్చిమద్వారైకతోరణం మండపం తన్మధ్యభాగే వేదిం పూర్వభాగే వర్తులం చతురస్రంవా కుండం స్థండిలంవా పశ్చిమే వాస్తుపీఠం, ఉత్తరే వాలుకయా స్థండిలంచ కృత్వా కాలాది స్మృత్వా మహాఫలా చ్ఛతగుణఫలకామోల్పప్రతిమాయాంతు దశగుణఫలకామోవా జీర్ణాదిదోషదుష్టస్య లింగస్య ప్రతిమాయావా ఉద్ధారం, ఉచ్ఛ్రయణంవా కరిష్యే ఇతి సంకల్పయేత్" అని లిఖింపఁబడినది.

---

## —♦ కాశీమాహాత్మ్యము ♦—

(శ్రీనాథుని కాశీఖండము)

సీ. కాశికానగరంబు కడసీమమున నున్న
చండాలుఁ బోల రాఖండలాదు
లానందవనములో నవశవస్థితి నున్కి
భువనసామ్రాజ్య వైభవముఁబోలు
అవిముక్తదేశస్థుఁ డయ్యెనేఁ బతితుండు
అశ్వమేధాధ్వరాహర్తఁదొరయు
వారణాసీ సంభవంబైన మశకంబు
ఐరావణముతోడ నవఘళించు

నాటుకొని శ్రీమహాశ్మశానమున నున్న
అణుకనగ్నాలవటుఁడైన నాగ్రహమున
గర్వితోద్ధతి నేతెంచు కాళరాత్రి
మృత్యుదేవతే మునిపండ్లు మెఱుకఁజాలు (ద్వి॥ఆ॥47)

తే. గీ. ఎన్నికల్పంబు లరిగిన నెడలిపోవ
దెందరింద్రులు గడచిన నెలమిదప్ప
దెన్నిమన్వంతరంబులు చన్న నెపుడు
పసిమిదప్పదు కాశికాపట్టణంబు. 48

సీ. ధర్మంబు కాశికాస్థానమధ్యంబున నాల్గుపాదంబుల నడచియాడు
అర్థంబు కాశీపురాంగణంబునయందు నానాప్రకారమై పీనుమిగులు

కామంబు కాశికాకటకఘంటాపథి గర్వించు రాజలోకంబు రేవ
మోక్షసంపదలు గాశీక్షేత్రమునయందుఁ బ్రవి తండంబులై
కాశి కల్యాణమున కాదికారణంబు [నివ్వటిల్లు
కాశి యణిమాదిసిద్ధుల కట్టుపట్టు
కాశి జనలోక సంకల్పకల్పపల్లి
కలుషపిశితంబు మెసవు శాకాసి కాశి. 30

సీ. ఉర్వీధరశ్రేణు లుఱ్ఱూఁతలూఁగంగ
ఏడుగాడ్పులువీచు నెన్నఁడేని
చండభానుండు పంద్రెండుమూర్తులు దాల్చి
ఎసఁగి యెండలుగాయు నెన్నఁడేని
పుష్కలావర్తకాంభోధరవ్రాతంబు
తెలగోలువర్షించు నెన్నఁడేని
భూర్భువస్స్వర్లోకములు ముంచి జలరాసు
లేకోదకముఁజూపు నెన్నఁడేని
ఎన్నఁడే నుండుఁ గాలంబు మిన్నుచక్కి
భూతములు గ్రాలు నెన్నఁడేఁ బుట్టినింక
అపుడు వారాణసీక్షేత్ర మైదుకోసు
లంతమేర యుపద్రవం బందకుండు. 51

సీ. పాలిండ్లుగదలంగఁ బసపుఁబయ్యెద విచ్చు
అచలాధిపతి కూర్మియాఁడుబిడ్డ
ఘూత్కారమొనరించు తొండంబుముక్కున
శీకరాసారంబుఁ జిలుకు దంతి
ప్రత్యక్షమైవచ్చి భాగీరథీగంగ
మృదులహస్తముసాఁచి మేను నిమురు
ప్రమథోత్తముఁడు భృంగి భయరక్షణార్థమై
ఫాలాగ్నిమునఁ దీర్చు భసితరేఖ
దక్షిణాశ్రితిమీఁదుగా ధాత్రిఁజెంది
పెద్దనిద్రకు మాఁగన్నువెట్టువేళ

పంచజనులకుఁ దారక బ్రహ్మవిద్య
అభవుఁ డుపదేశ మొనరించునపుడు కాశి. 53

తే. గీ. ప్రాణి యాహారకబళంబుఁ బాఱవైచి
కూర్పరము నాకు పెను వెట్టికూళవోలె
భోగమోక్షములకు జన్మభూమియైన
కాశి విడిచి నరుం డన్యదేశ మరుగు. 110

శా. కింకుర్వాణపురందరాదిక మహాగీర్వాణకోటీ కిరీ
టాంకస్థాపిత నూత్నరత్నరుచిధారాశ్లేష కిమ్మీర ప
త్పంకేజుండు హరుండు జంతువులకుం బ్రాణాంతకాలంబునం
దోంకారాక్షరమంత్రరాజముఁ జెవిన్ యోజించుఁ గాశీస్థలిన్.

(తృ॥ అ॥ 95)

తే. గీ. ఎడమప్రక్కయి కాశిలో నీల్గునట్టి
మశకశిశువున కోంకారమంత్రరాజ
మభవుఁ డుపదేశ మొనరింప నమరకోటి
సిగ్గువడుచుండుఁ దమ వృథాజీవములకు. 98

చ. కటకట! కాశికాపురి నొకానొకనిద్దురఁ గన్నుమోడ్చి య
ప్పటఁ గనువిచ్చునప్డు కుడిభాగముఁ గన్గొని చోద్యమందు దా
పటి దెసఁ జూచి యచ్చెరువుపాటు వహించు మనస్సరోజనం
పుటమున నాఁడులాగు మగపోఁడిమియుం గల జంతుసంతతుల్. 99

సీ. ఉద్ఘాటితంబులై యుండు కేలువగళ్ళ
గవనితల్పులు నాకకటకమునకు
సర్వజంతువులకు సంసిద్ధిసంపద
గరతలామలకమై కానవచ్చు
వికటామహాదేవి విశ్వనాథునిభామ
పర్వతాధిపపుత్రి పాయ దెపుడు
సిద్ధివినాయకక్షేత్రపాలకు లుండ్రి
పరిరక్షణైకతత్పరతఁ బూని

భూమి తిలమాత్రమును వృథవోవకుండ
అమృతలింగంబు లర్బుదన్యర్బుదములు
కలవు తీర్థరాజంబులు కాశియందు.
మహిమ కావాస మవిముక్తమంటపంబు. 229

సీ. అప్సరోంగనలెల్ల నాటపాటలవెంట
ప్రాపించిరి మనోరథార్థసిద్ధి
గంధర్వుఁ డొకఁడు గానవిద్యాప్రాప్తి
శీఘ్రంబునంద సంసిద్ధిఁగాంచె
యక్షపుంగవుఁడు విద్యాధరశ్రేష్ఠుండు
కోకిలాలాపయన్ కోమలియును
శతరుద్రమంత్రైకజపపరాయణుఁడైన
వేదశిరుండను విప్రవరుఁడు

చంద్రమౌళి భరద్వాజ సంయములును
హంసపదియను నొక కిన్నరాంగనయును
ఆప్రవాళోష్ఠిమగఁడు వేణుప్రియుండు
సిద్ధిఁబొందిరి యవిముక్తసీమయందు. 231

తే. గీ. కాశి నీశానదేవు శ్రీకంఠుఁ గొలిచి
కాంచు మనుజుఁడు హృదయసంకల్పసిద్ధి.
కాశికాక్షేత్ర మష్టదిక్పాలకులకు
కామనావాప్తిసంకల్పకల్పతరువు. (చతు॥ అ॥ 167).

తే. చంద్రకుండ చంద్రేశ్వరస్థానమునకు
ప్రాగ్దిశాభాగమునయందు భక్తి నరుఁడు
కాశికాక్షేత్రసీమ బుధేశుఁగొలిచి
పరమబోధంబు దప్పఁడు ప్రాణవిరతి. 231

కం. వారాణసి శుక్రేశ్వరు నారాధించినసరుండు ప్రాపించు సమ
గ్రారోగ్యాయుఃపుత్రశ్రీరాజ్యైశ్వర్యశౌర్యచిరసౌఖ్యంబుల్.

ఉ. పాయు నలక్ష్మి పాయు నశుభంబులు పాయును దుర్నిమిత్తముల్
పాయు నకీర్తి పాయుఁ బ్రతిబంధము పాయు మహాఘసంఘముల్

డాయు శుభంబు డాయుఁ గుశలంబులు డాయు మనోరథార్థముల్
పాయక కాశిఁ గట్టెదురఁ బాయు వియన్నదిఁ దీర్థమాడినన్.
(పం॥ ఆ॥ 35)

చ. నడచుచుఁ గూరుచుండుచును నవ్వుచు నిల్చుచుఁ బారియాడుచున్
కుడుచుచుఁ బవ్వళించుచును గూర్కుచు మేల్కనుచుం రమించుచున్
పడుచును లేచుచున్ నరుఁడు భావమునం దవిముక్తసీమ సం
గడిఁ బ్రవహించు శ్రీ గగనగంగఁ దలంచి త్యజించుఁ బాపముల్. 40

ఉ. రోదనమాచరించు వగఁ గ్రోధమనోభవకామలోభమో
హాదులఁ గూడి తీరములయం దఘముల్ తలపట్టుపట్టి నేఁ
డాదిగ దీనఁ బాయఁబడెనా మనకంచును గాశికానమ
ర్యాదమునన్ వియత్తటిని నాడఁగ మర్త్యుఁడు గట్టు డిగ్గుచోన్.

సీ. పలుదచన్నులమీఁది పలుపచ్చిగందంబు
కమ్మతావులు దిఙ్ముఖములఁ బొదువ
శశికాంతమణిశిలాశకలపాండురమైన
మెయిచాయ చంద్రికామృతముఁ గురియ
జలదేవతాహస్తచామరానిలములు
కుటిలాలకములకు గొండ్లిగఁజప
ధవళాతపత్ర ముక్తాదామకంబులు
గురుసువర్ణకిరీటకోటి పెఱయ
పూర్ణకుంభంబుతో సితాంబుజముతోడ
దరముతోడ నభీతితోఁ గరము లలర
నదనదీపల్వలంబులు గదిసి కొల్వ
కాశిఁ బేరోలగంబుండు గగనగంగ. 52

తే. పరిహసించును వేదాంతభాగమన్న
ఉపనిషత్తన్న పీనుల నోకిలించు
కంటగించును సాంఖ్యయోగంబులన్న
కాశినున్న నరుండు మోక్షమునఁ దనిసి. 55

కం. దేహత్యాగము దానము, దేహనిపాతంబు దపము ధృతిఁబరికింపన్
దేహవియోగము యోగం, బాహా! కాశీపురీకృతావాసులకున్.

తే. విశ్వనాథుండు దేహళీ విఘ్నరాజు
గవని మొగసాల నధికారిగా నొనర్చె.
కాశిఁ జొరనీఁడు తన ముద్రిగానియట్టి
ముక్తనిధి నెవ్వఁ డొడుచునో మోసమనుచు. 77

మ. నియమం బొప్పఁగఁ గాశికాపురి భవానీశంకరుల్ విష్టప
త్రియముం గాతురు తల్లిదండ్రులగుచున్ దాక్షిణ్య మొప్పంగ. ప్ర
త్యయ మేతద్విషయంబునం దెలియఁగాదా యెప్డు మధ్యాహ్న మ
తుయభిక్షాన్నము వెట్టుచుందురు బుభుక్షాక్షీణమర్త్యాళికిన్.
[ష॥ ఆ। 128

తే. గృహము వారాణసీసీమ. గృహిణి గౌరి.
విశ్వనాథుండు గృహమేధి శాశ్వతుండు.
పరమకారుణ్యనిధులు దంపతులు దారు.
మునికినప్పుడు సిద్ధించు మోక్షభిక్ష. 129

సీ. శ్రీవిశాలాక్షిచే శిశిరభానుకిరీటు
అర్ధాంగలక్ష్మిచే నగజచేత
లలితచేఁ దరుణపల్లవపాటలాంగిచే
జవరాలిచే లోకజననిచేత
పూఁబోఁడిచే విశ్వభుజచేత హ్రీంకార
వనజవాటి విహారవరటచేత
శివదూతచేతఁ బశ్చిమనాడికావీధి
పరమయోగులు గాంచు ఫలముచేత

చిత్రకంఠికచే నీలచికురచేత
భద్రకాళికచే దైత్యభయదచేత
నిగళభంజనచేఁ గృపానిఘ్నచేత
గరిమ నైకొనె శ్రీకాశికాపురంబు. 191

ఆ. గుజ్జుమోకమావి కుజ్జామహాదేవి
భక్తలోకకీరపతగములకు
కమల గమలనాభు గారాబుదేవేరి
గ్రామదైవతములు కాశినగరి. 192

శా. ఝుంకించుం గరతర్జనీముఖమునన్ శైలేశ్వరీదేవి గా
ర్యంకస్థాయిని భక్తకోటి బహుళాఘౌఘుంబులన్ నిచ్చలున్
హ్రీంకారాక్షరమంత్రసాధకశిఖరక్రీడాకళాలోల సా
హంకారామరవైరిమర్దన విధవ్యాపారపారీణయై. 195

కం. విధిశక్తిఁ గాశికాపుర
నిధి నిరుపమనిరభిసంధినిరవధికకృపా
భ్యధికవిధీశ్వరశివు స
న్నిధిఁ గొలిచిన నరుఁడు గాంచు నిరుపమసిద్ధుల్. 198

తే. కాశి భీమేశ్వరునిచక్కఁ గట్టెదురను
పాశపుష్కరపాణియై భద్రకాళి
భీమచండి మహాదేవి భీమకుండ
పార్శ్వభూమండలంబునఁ బాయకుండు. 201

తే. తాటిపొడవున నవిముక్తధామసీమ
తాళజంఘేశ్వరీదేవి తలిరుఁబోఁడి
విఘ్నములఁ జీరికొట్టును వెదకివెదకి
తాటికంబంబు సవ్యహస్తమునఁ దాల్చి. 203

కం. వికటాననయను దేవత
మకుటాంగదకటకహారమండన కాశీ
నికటమున నుండుఁ బాయక
అకలంకశశాంకశకల మాదల నుండన్. 204

తే. మొగుచు జంతువు కాశికానగరసీమ
అపునరున్మీలనమునకై యక్షియుగము.
కాంచునిక్కలగా నొక్కకలయు నపుడు
త్రిణయనుండుగఁ దన్ను నదీర్ఘనిద్ర. 261

తే. పాడి మెచ్చించె నొకయింతి పంజళమున.
ఆడి మెచ్చించె లేమ లాస్యమున నొర్తు.
పొగడి మెచ్చించె నొక్క లేఁజిగురుఁబోఁడి.
కరుణగలవాఁడు కాశి నోంకారభర్త. 265

మ. గయకేలా యరుగంగ మానవులకున్? కాశీపురీవాహినీ
త్రియవేణీపులినంబులందు నిడరాదా తల్లినిం దండ్రినిన్
బ్రియమాతామహులం బితామహులనుం బ్రోచుం బిండాన్నముల్?
కయికోరోటు ప్రియంబుతోడఁ బితరుల్ హస్తాగ్రముల్ సాచుచున్?

తే. ఇతరదేశంబులం దుపార్జితములైన
పాపములు వాయుఁ గాశికాపట్టణమున.
కాశిఁ జేసినపాప మెక్కడను బాయ.
దదియుఁ బాయుఁ ద్రివిష్టపోపాంతభూమి. 280

తే. కాశి జంబూతరుద్వీపకనకభూష.
కాశియం దుత్తమంబులు గ్రమనిరూఢి
సింధుసంభేద మోంకారశివపదంబు
శ్రీత్రివిష్టపనాయకక్షేత్రతలము. 281

సీ. క్రూరుండు పిశునుండు గోఘ్నుఁ డభక్ష్యభ
క్షకుఁడు విస్రంభవిఘాతుకుండు
గురుతల్పగుఁడు నిందకుఁడు నాస్తికుఁడు కూట
సాక్షి పరద్రవ్యచౌర్యపరుఁడు
మాతాపితృత్యాగి యాతతాయి శఠుండు
పరదారలోలుండు గరళదుండు
కులధర్మవిముఖుండు గురుజనద్వేషుండు
బ్రహ్మహత్యా సురాపానరతుఁడు
నాఁగఁ గల పాపుల కఘంబు నీఁగ దిక్కు
శ్రీత్రివిష్టపదేవుండు శేషధరుఁడు
నీలలోహితు నభవు నిందించునట్టి
కర్మచండాలునికి దక్క కాశియందు. 284

ఉ. సత్యము పల్కెదన్. శ్రుతులు శాస్త్రము లాగమముల్. పురాణముల్
ప్రత్యయమయ్యెనే నిజముఁ బట్టెద రింతియ కాక యేమి? దు
రత్యపహారదక్షయగు కాశియ తీర్థము తీర్థకోటిలో.
నిత్యుఁడు విశ్వనాయకుఁడు నిక్కపుదైవము దైవకోటిలోన్. 287

సీ. శిశిరభూధరకన్య చిఱుబంతివసపాడు
ఎందు సాయంకాల మింపెలర్ప
నరుఁ జెందు జలము నుద్ధరణంబుసేవించి
శంభులింగముఁ దాల్చు జఠరపిఠరి
వినుపిదిఁ బోతాడి వివశంబులై కూలి
హంసంబులయ్యె హాయసము లెందు
ప్రవహించు నెందు శ్రీభాగీరథికిఁ బోటి
అమృతస్రవాహ్వయమైన తటిని
అది విముక్తవధూకంఠహారలతిక
దివ్యకేదారలింగేశతీర్థభూమి
నదనదీవాపి పల్వలహ్రదసమగ్ర
ద్రాక్షవందిలి కాశికోద్యానము సకు. 304
సీ. పసిఁడికమ్ములతోడి కుసుమపూవన్నియ
నిద్దంపుఁబుట్టంబు నెఱికఁగట్టి
ఇంద్రనీలములతో నెడకట్టిగుచ్చిన
రమణీయ తారహారము ధరించి
పారిజాతకతరుప్రసవగర్భిణియైన
కబరిపైఁ జెంగల్వకచ్చు నిలిపి
ఫాలభాగంబునఁ బన్నిట మెదిచిన
కమ్మకస్తురి తిలకమ్ముదీర్చి
వలుఁదచన్నుల జిలుగుఁ గంచులికఁదొడిగి
కటిభరంబున వజ్రాల కమరు దాల్చి
అరసి యాఁకొన్నవారికి నమృతభిక్ష
కరుణ నిడు శ్రీవిశాలాక్షి కాశియందు. స॥ ఆ॥ 5
స్ర. ఆనందారణ్యపూర్మధ్యమునఁ గలవు కోట్లర్బుదన్యర్బుదంబుల్
నానాముక్తిప్రదంబుల్ నలినజమురభిన్నాకరాడ్వందితంబుల్
స్థానంబుల్ గల్గు నీపంచనదమున మహాశంభుతీర్థంబుతోడన్
వానిన్ సామ్యంబు సేయన్ వలదు బహులనిర్వాణలక్ష్మీసమృద్ధిన్.
తే. అంబికకుఁ బుట్టినిల్లు నీహారశిఖరి
అత్తవారిల్లు కాశీమహాపురంబు.

హిమకరోత్తంసునకుఁ బుట్టినిల్లు కాశి
అత్తవారిగృహంబు నీహారశిఖరి. 100

ఉ. ఏనికమోము బూమియు వహించి చరించుచునుండు కామధు
గ్ధేనువు డుంఠి గాశి. ఇది తెల్లము వేల్పులగిడ్డి గానినాఁ
డీనునె మోక్షతర్ణకము నిచ్చునె కాంక్షితదుగ్ధధార దూ
ర్వానవపల్లవావళులు వైచినమాత్రిన భక్తకోటికిఁ ? ష॥ ఆ॥ 61

కం. సేవ్యుఁడు విశ్వేశుఁడు స్నాతవ్యము మణికర్ణికాహ్రదజలౌఘము శ్రో
తవ్యంబులు శంభుకథాదివ్యపురాణములు కాశితీర్థమునందున్.

సీ. వసియింపవలయు యావజ్జీవ మనురక్తి
పరత వారాణసీపట్టణమున.
చక్రపుష్కరిణి నిచ్చలుఁ దీర్థమాడంగ.
వలయు సంకల్పపూర్వముగాఁగ.
అర్చింపవలయు గంధాక్షతంబులఁ బుష్ప
ఫలపత్రముల విశ్వపతి మహేశు.
నిలుపంగవలయును నెఱసు వాటిలకుండ
ఆత్మధర్మ స్వవర్ణాశ్రమముల.
స్నానమహిమంబు భక్తి తాత్పర్యగరిమ
వినఁగవలయుఁ బురాణార్థవిదులవలన.
తన యథాశక్తి వలయును దానమిడఁగ.
కాశిఁ గైవల్య మిన్నింటఁగాని లేదు. 114

తే. తీర్థసన్న్యాసకారులై ధీరబుద్ధి
కాశి వసియించుపెద్దల గౌరవించు
టధికధర్మంబు. దాన నాహ్లాదమందు
వివిధకైవల్యసంధాయి విశ్వభర్త. 118

సీ. కుదియించునది నెట్టుకొని యింద్రియవ్యాప్తి
మనసుచాంచల్యంబు మాన్పునదియు
మదిలోన మోక్షకామము వీడుకొనునది
పాయంగనిడునది ప్రాణభయము
వ్రతదానధర్మసంరక్షణార్థంబుగా
కావించునది యాత్మకాయరక్ష